# FOLLOW THE DRINKING GOURD

By Jeanette Winter

# నీటి బుర్రను అనుసరించు

జీనెట్ వింటర్, తెలుగు: కె. సురేష్



# నీటి బుర్రను అనుసరించు

జీనెట్ వింటర్, తెలుగు: కె. సురేష్



## A NOTE ABOUT THE STORY

**In the early days of slavery in the United States many slaves tried to escape their cruel bondage by fleeing north – usually to Canada - to freedom. By the 1840s a loosely organized group of free blacks, slaves, and white sympathizers formed a secret network of people and places that had escaped slaves on their dangerous journey to freedom – a network that came to be known as the Underground Railroad.**

**Traveling along darkened roads at night, hiding out by day, moving slowly upriver along hundreds of miles of connecting waterways, the fugitive slaves endured many hardships. Slave catchers hunted them down with dogs. Many were shot or hanged. And even after crossing into the "free" states, runaway slaves could still be captured and returned to their masters for a reward.**

**The most famous conductor on the Underground Railroad was Harriet Tubman, a runaway slave herself, who led hundreds of her people to freedom. Among other conductors, there was a one-legged sailor named Peg Leg Joe. Joe hired himself out to plantation owners as a handyman. Then he made friends with the slaves and taught them what seemed a harmless folk song – "Follow the Drinking Gourd." But hidden in the lyrics of the song were directions for following the Underground Railroad. The Drinking Gourd is the Big Dipper, which points to the North Star. "When the sun comes back, and the first quail calls" meant spring, when travel might be least hazardous. As the runaway slaves followed the stars north, they would come across marks Peg Leg Joe had made in mud or in charcoal on dead trees – a left foot and a peg foot – and they would know they were on the right trail.**

**The river that "ends between the two hills" was the Tombigbee River. The second was the Tennessee River and the "great big river" was the Ohio River, where Peg Leg Joe would be waiting to ferry them across to the free states on the other side. From there the fugitives were guided from one hiding place to the next until – with luck – they made it to Canada or other safe places in the North.**

## ఈ కథ గురించి ఒక మాట

అమెరికాలో బానిసత్వపు తొలినాళ్లలో ఆ క్రూర నిర్బంధం నుంచి పారిపోటానికి చాలా మంది బానిసలు ప్రయత్నించారు. స్వేచ్ఛ కోసం ఉత్తర దిశగా, ఎక్కువగా కెనడాకి పారిపోయేవాళ్లు. 1840ల నాటికి స్వేచ్ఛ పొందిన నల్ల జాతీయులు, బానిసలు, సానుభూతి ఉన్న తెల్ల జాతీయులు కలిసి ఒక రహస్య బృందంగా ఏర్పడ్డారు. స్వేచ్ఛ కోసం పారిపోతున్న బానిసలకు సహాయపడే వ్యక్తులను, ప్రదేశాలను వీళ్లు గుర్తించారు. ఈ సమూహాన్ని "రహస్య రైలుమార్గం"గా వ్యవహరించేవాళ్లు.

పారిపోతున్న బానిసలు రాత్రుళ్లు ప్రయాణం చేస్తూ, పగలు విశ్రాంతి తీసుకుంటూ ఉండేవాళ్లు. ఎన్నో కష్టాలకు ఓర్చి నది ఎగువకు నీటి మార్గాల గుండా ఈ బానిసలు వందలాది మైళ్లు ప్రయాణం చేసేవాళ్లు. కుక్కల సహాయంతో బానిసలను పట్టుకునేవాళ్లు వాళ్లని తిరిగి పట్టుకోటానికి ప్రయత్నించేవాళ్లు. చిక్కిన వాళ్లలో చాలామందిని కాల్చి, ఉరితీసి చంపేశారు. "విముక్త" రాష్ట్రాలలోకి చేరుకున్న తరువాత కూడా పారిపోయిన బానిసలను పట్టుకుని వాళ్ల యజమానులకు అప్పగించి బహుమతి పొందే అవకాశం ఉంది.

రహస్య రైలుమార్గంలో హారియట్ టబ్‌మ్యాన్ బాగా ప్రసిద్ధి చెందారు. ఆమె కూడా పారిపోయిన బానిసే, వందలాది బానిసలు స్వేచ్ఛను పొందటానికి సహాయం చేశారు. అలా సహాయం చేసినవాళ్లలో పెగ్ లెగ్ జో అనే ఒంటి కాలి నావికుడు ఉన్నాడు. తోటల యజమానులకు సహాయకుడిగా జో పనికి కుదురుకునేవాడు. అక్కడ బానిసలతో స్నేహం చేసి ఎటువంటి అనుమానం రాని పాటను నేర్పేవాడు - "ఫాలో ది డ్రింకింగ్ గౌర్డ్" (నీటి బర్రను అనుసరించండి). ఈ పాట చరణాలలో రహస్య రైలుమార్గంలో ప్రయాణించటానికి సూచనలు ఉన్నాయి. నీటి బుర్ర అంటే ఆకాశంలోని సప్తర్షి మండలంలోని నక్షత్రాలు, ఇది ఉత్తర దిక్కును చూపిస్తుంది. "సూర్యుడు ఉదయించి, తొలి కముజు కూసినప్పుడు" అంటే వసంత కాలం అని అర్థం, అప్పుడు ప్రయాణం తేలికగా ఉంటుంది. నక్షత్రాలను అనుసరించి ఉత్తర దిక్కుకి వెళుతుంటే దారిలో జో చేసిన గుర్తులు ఎడమ పాదం, కుడి కొయ్య కాలు వాళ్లు సరైన దారిలోనే ఉన్నారని తెలియచేసేవి.

"రెండు కొండల మధ్య నది" అంటే టామ్‌బిగ్‌బీ నది. రెండవది టెన్నెస్సీ నది. "పెద్ద నది" అంటే ఓహియో నది. నదిని దాటించి, స్వేచ్ఛా రాష్ట్రాలలోకి చేర్చటానికి కొయ్య కాలు జో అక్కడ వేచి ఉంటాడు. అక్కడినుంచి ఒక సురక్షితమైన ఇంటి నుంచి మరో సురక్షిత ఇంటికి చేర్చేవాళ్లు. అంతా బాగుంటే బానిసలు కెనడా లేదా సురక్షిత ఉత్తర ప్రదేశాలను చేరుకునేవాళ్లు.



**Long ago before the Civil War there was an old sailor called Peg Leg Joe who did what he could to free the slaves.**

**అమెరికాలో పౌర యుద్ధానికంటే ముందు బానిసలకు స్వేచ్ఛ కల్పించటానికి తాను చెయ్యగలిగింది చేసిన కొయ్య కాలు జో అనే ముసలి నావికుడు ఒకడుండేవాడు.**



**Joe had a plan to use hammer and nail and saw, and work for the master. The man owned slaves on the cotton plantation.**

**యజమాని కోసం జో వడ్రంగం పని చేసేవాడు. ఆ యజమాని పత్తి పొలాల్లో బానిసలు పనిచేసేవాళ్లు.**



**Joe had a plan at night when work was done he taught the slaves a song that secretly told the way to freedom. Just follow the Drinking Gourd it said.**

**పని అయిన తరువాత రాత్రి బానిసలకు జో ఒక పాట నేర్పించేవాడు. ఎవరికీ తెలియకుండా అది విముక్తి మార్గాన్ని చూపించేది. నీటి బుర్రను అనుసరించు అని ఆ పాట చెబుతుంది.**



**When the song was learned and sung all day Peg Leg Joe would slip away and work for another master and teach the song again.**

**అందరూ ఆ పాట నేర్చుకుని మొత్తం పాడుతుంటే కొయ్య కాలు జో అక్కడి నుంచి తప్పించుకుని ఇంకొక యజమాని వద్ద పని చేసేవాడు. అక్కడి బానిసలకు కూడా అదే పాట నేర్పించేవాడు.**



**One day a slave named Molly saw her man James sold to another master. James will be taken away and the family torn apart. Just one more night together.**

**ఒక రోజు తన భర్త జేమ్స్‌ని ఇంకొక యజమానికి అమ్మెయ్యటం మోలీ చూసింది. అందరూ కలిసి ఉండేది ఆ ఒక్క రాత్రే. తరువాత పుట్టకొకరు, చెట్టుకొకరుగా చెల్లాచెదురైపోతారు.**




**A quail calls in the trees that night. Molly and James remember Joe′s song.**

**They sing it low:**

**ఆ రాత్రి అడవిలోని కముజు అరుపు వినిపించింది. మోలీ, జేమ్స్‌కి జో నేర్పించిన పాట గుర్తొచ్చింది.**

**దానిని మెల్లగా పాడసాగారు:**



**“When the sun comes up and the first quail calls, follow the Drinking Gourd.”**

**“సూర్యుడు ఉదయించి, తొలి కముజు కూసినప్పుడు, నీటి బుర్రను అనుసరించు.”**



**They looked to the sky and saw the stars. Taking their son Isaiah, old Haddie and her grandson George, Molly and James set out for freedom that very night following the stars of the Drinking Gourd.**

**వాళ్లు ఆకాశంలోని చుక్కలకేసి చూశారు. తమ కొడుకు ఈసాయి, ముసలి హాడ్డీ, మనవడు జార్జ్‌లను తీసుకుని ఆ రాత్రే మోలీ, జేమ్స్ నీటి బుర్రను అనుసరిస్తూ తమ స్వేచ్ఛాపదాన్ని వెతుక్కుంటూ బయలుదేరారు.**



**They ran all night through the fields till they crossed the streams of the woods.**

**ఆ రాత్రంతా పొలాలగుండా పరిగెత్తి, అడవిలోని వాగుని దాటారు.**



**When daylight came they hid in the trees watching, listening for the master's hounds that were loose to find them.**

**పగలు కావటంతో తమ యజమాని పంపించే వేటకుక్కలకు భయపడుతూ వాళ్లు దట్టమైన చెట్లలో దాక్కున్నారు.**



**But the dogs lost the runaway scent at the stream and Molly and James and Isaiah old Haddie and young George were not found. They hid all day in the woods.**

**వాగు దాకా వచ్చిన కుక్కలకు ఆ తరువాత వాళ్ల వాసన దొరకలేదు. దాంతో మోలీ, జేమ్స్, ఈసాయి, ముసలి హాడ్డీ, మనవడు జార్జ్ తప్పించుకున్నారు. ఆ పగలంతా వాళ్లు ఆ అడవిలోనే దాక్కున్నారు.**



**At night they walked again singing Joe′s song and looking for the signs that marks the trail.**

**ఆ రాత్రి జో నేర్పిన పాట పాడుతూ, దారి వెంట సంకేతాల కోసం చూస్తూ వాళ్లు ప్రయాణం చేశారు.**



**Sometimes empty bellies to sleep on. Sometimes no stars to guide the way.**

**ఒక్కొక్కసారి ఖాళీ కడుపులతో నిద్రపోయేవాళ్లు. ఒక్కొక్కసారి దారి చూపటానికి చుక్కలు ఉండేవి కావు.**



**“Now the river bed makes it a very good road, The dead trees were showing the way**

**The foot peg for travel, and follow the Drinking Gourd.”**

**“వాగు ఇసక చక్కని దారి, చనిపోయిన చెట్లు సంకేతాలు,**

**కొయ్య కాలు గుర్తులు, నీటి బుర్రను అనుసరించండి.”**



**Walking by night, sleeping by day for weeks they travelled on. Sometimes berries to pick and corn to snatch and sometimes fish to catch.**

**రాత్రుళ్లు నడుస్తూ, పగటిపూట నిద్రిస్తూ వాళ్లు వారాల తరబడి ప్రయాణం చేశారు. దారిలో అడవి పళ్లు తిన్నారు, మొక్కజొన్న దొంగలించారు, వాగులో చేపలు పట్టుకున్నారు.**



**They never knew what lay ahead. There was danger from men who would send them back and danger from hungry beasts. But sometimes a kind deed was done.**

**ఏ క్షణంలో ఏం జరుగుతుందో వాళ్లకి ఏమాత్రం తెలియదు. తమ యజమాని దగ్గరకు వెనక్కి పంపించే మనుషుల నుంచి, అడవి జంతువులనుంచి వాళ్లకి ప్రమాదం పొంచి ఉంది. అప్పుడప్పుడు మంచి కూడా జరిగేది.**



**One day as they hid in a thicket a boy from a farm found them. In a bag of feed for the hogs in the wood he brought bacon and corn bread to share. Singing low they traveled on.**

**ఒక రోజు చెట్లలో దాక్కుని ఉండగా వ్యవసాయ క్షేత్రంలోని ఒక అబ్బాయి వాళ్లని చూశాడు. అడవిలోని పందులకు దాణా తెచ్చే సంచిలో వాళ్ల కోసం మాంసం, మొక్కజొన్న రొట్టె తెచ్చాడు**



**“The river is between the two hills, follow the Drinking Gourd.**

**There is another river on the other side, follow the Drinking Gourd.”**

**“రెండు కొండల మధ్య నది ఉంది, నీటి బుర్రను అనుసరించండి.**

**ఆవలి తీరాన మరొక నది ఉంది, నీటి బుర్రను అనుసరించండి.”**



**On and on they followed the trail to the river's end. From the top of the hill they saw the new path – another river beneath the stars to lead them to freedom land. The Drinking Gourd led them on. The song was almost done.**

**నది చివరి వరకు వాళ్లు సంకేతాలను అనుసరించారు. కొండపైనుంచి వాళ్లకి కొత్త దారి కనపడింది – స్వేచ్ఛా భూమికి తీసుకుని వెళ్లే మరొక నది తారల ఆకాశం కింద కనిపించింది. పాట ముగింపుకి వచ్చింది.**



**“When the great big river, meets the little river, follow the Drinking Gourd,**

**For the old man is waiting to carry you to freedom, if you follow the Drinking Gourd.”**

**“పెద్ద నది చిన్న నదిని కలిసే చోట, నీటి బుర్రను అనుసరించండి,**

**స్వేచ్ఛలోకి తీసుకెళ్లటానికి ముదుసలి వేచి ఉన్నాడు, నీటి బుర్రను అనుసరించారా మరి.”**



**They climbed the last hill. Down below was Peg Leg Joe waiting at the wide Ohio River to carry them across. Their spirits rose when they saw the old man. Molly and James and Isaiah, old Haddie and George ran to the shore.**

**వాళ్లు చివరి కొండ ఎక్కారు. విశాలమైన ఓహియో నదిని దాటించటానికి కొయ్య కాలు జో కింద వేచి ఉన్నాడు. ఆ ముదుసలిని చూడగానే వాళ్లకి కొత్త ఉత్సాహం వచ్చింది. మోలీ, జేమ్స్, ఈసాయి, ముసలి హాడ్డీ, చిన్న జార్జ్ నదీ తీరానికి పరుగులు తీశారు.**



**Under a starry sky Joe rode them across the wide Ohio River. He told them of hiding places where they would be safe – a path of houses stretched like a train on a secret track leading north to Canada. He called it the Underground Railroad. It carried riders to freedom.**

**ఆకాశంలో తారలు మిణుకుమంటున్నాయి, వాళ్లను నదిని దాటించాడు జో. ఉత్తరాన ఉన్న కెనడాకి వెళ్లే రహస్య రైలు మాదిరి దారి పొడుగూతా పరుచుకున్న వాళ్లకి ఆశ్రయమిచ్చే ఇళ్ల గురించి అతడు చెప్పాడు. దానికి అతడు "రహస్య రైలుమార్గం" అని పేరు పెట్టాడు. ప్రయాణికులను అది స్వేచ్ఛలోకి తీసుకెళుతుంది.**



**The first safe house stood on the hill. The lamp was lit which meant it was safe to come. Ragged and wary they waited well. Joe signaled low with a hoot like an owl. Then the door opened wide to welcome the freedom travelers.**

**ఆశ్రయం ఇచ్చే మొదటి ఇల్లు కొండపైన ఉంది. దీపం వెలుగుతోంది కాబట్టి అంతా బాగానే ఉందని అర్థం. అలసి సొలసి ఉన్నప్పటికీ వాళ్లు ఓపికగా వేచి ఉన్నారు. గుడ్లగూబ లాగా అరిచి జో సంకేతం పంపించాడు. తలుపులు బార్లా తెరిచి స్వేచ్ఛా యాత్రికులను వాళ్లు ఆహ్వానించారు.**



**They were rushed through the house to the barn for the farmers knew there were slave-catchers near.**

**ఇంటిలోంచి వాళ్లను వెంటనే కొట్టంలోకి తీసుకెళ్లారు. బానిసలను పట్టుకునేవాళ్లు చుట్టుపక్కలే ఉంటారని ఆ రైతులకు తెలుసు.**



**A trapdoor on the floor took them under the barn to hide until it was safe to move on. Then Peg Leg Joe went back to the river to meet others who followed the Drinking Gourd.**

**గచ్చులో ఉన్న తలుపు వాళ్లని నేలమాళిగలోకి తీసుకుని వెళ్లింది. మళ్లీ ప్రయాణం చేసేవరకు వాళ్లు అక్కడ సురక్షితంగా ఉండవచ్చు. నీటి బుర్రను అనుసరించి వచ్చే వాళ్లను కలుసుకోటానికి ఆ తరువాత కొయ్య కాలు జో తిరిగి నది వద్దకు వెళ్లాడు.**



**This time James called the signal a hoot like an owl that opened the door to a Quaker farm the travelers were led to a secret room hidden behind the shelves.**

**ఈసారి సంకేతమైన గుడ్లగూబ అరుపును జేమ్స్ అనుకరించాడు. దాంతో క్వేకర్ క్షేత్రంలోని తలుపులు తెరుచుకున్నాయి. అలమర వెనక ఉన్న రహస్య గదిలో వాళ్లను దాచిపెట్టారు.**



**With dangers still near to close for ease the farmers send the five travelers on. He drew a map that showed the way to North on the midnight road to the next safe house just over two hills.**

**ప్రమాదం పొంచి ఉన్న పరిస్థితులలోనే ఆ అయిదుగురు యాత్రికులను రైతు ముందుకు సాగనంపాడు. ఉత్తర దిశలో రాత్రంతా ప్రయాణం చేసి, రెండు కొండల అవతల ఉన్న సురక్షితమైన తరువాతి ఇంటికి చేరుకోటానికి ఆ రైతు పటం గీసి ఇచ్చాడు.**



**They rested here for many days and heal their wounds. Soft beds, full meals, new clothes; hot baths washed away some fear and pain.**

**వాళ్లు అక్కడ చాలా రోజులు బస చేసి సేదదీరారు. వాళ్ల గాయాలు మానుబట్టాయి. మెత్తటి పక్కలు, కడుపునిండా తిండి, కొత్త బట్టలు, వేడినీటి స్నానాలతో వాళ్ల నొప్పులు, భయాలు చాలావరకు తొలగిపోయాయి.**



**Isaiah smiled.**

**ఈసాయి నవ్వాడు.**



**When they were strong they traveled again from house to house on the underground trail still following the drinking gourd north.**

**బలాన్ని కూడగట్టుకున్న తరువాత రహస్య మార్గం గుండా ఇంటింటికీ మళ్లీ ప్రయాణం మొదలుపెట్టారు. ఉత్తరాన ఉన్న నీటి బుర్రను ఇంకా అనుసరిస్తూనే ఉన్నారు.**



**Sometimes they traveled on foot, sometimes they by cart. The wagon they rode near their journeys and carried fruit to market and runaways to freedom.**

**కొన్నిసార్లు వాళ్లు నడిచేవాళ్లు. కొన్నిసార్లు బళ్లల్లో వెళ్లేవారు. ఆ బళ్లు బజారుకి పళ్లతోపాటు పారిపోయి వచ్చినవాళ్లను స్వేచ్ఛకి తరలించేవి.**



**At last they came to the shores of Lake Erie. Molly and James and Isaiah old Haddie and young George climbed aboard the steamship that would carry them across to Canada for freedom. Five more souls are safe old Haddie cried. The sun shone bright when they stepped on land. They had followed the Drinking Gourd.**

**చివరికి వాళ్లు ఎరీ సరస్సు ఒడ్డుకి చేరుకున్నారు. స్వేచ్ఛా జగత్తు అయిన కెనడాలోకి తీసుకుని వెళ్లే మరపడవలోకి మోలీ, జేమ్స్, ఈసాయి, ముసలి హాడ్డీ, చిన్న జార్జి ఎక్కారు. మరో అయిదుగురు తప్పించుకున్నారని ముసలి జార్జి అరిచాడు. నేల మీద వాళ్లు కాలు పెట్టినప్పుడు సూర్యుడు తేజోవంతంగా ప్రకాశిస్తున్నాడు. వాళ్లు నీటి బుర్రను అనుసరించారు.**